ఓమ్.



# శ్రీ పాండురంగశతకము.

—:0:—

సీ॥ శ్రీ రుక్మిణీనాథ శిక్షితాసురనాథ
కటిధృతహస్త లోకప్రశస్త
రత్నమంజులభూష రమణీయతరవేష
భవ్యకౌస్తుభవక్ష పంకజాక్ష
రాజసేవితపాద రక్షితప్రహ్లాద
కాలాభ్రసమదేహ గరుడవాహ
కనకమంజులచేల కరిరాజపరిపాల
నిజదాసజనహృద్య నిగమవేద్య
గీ॥ మహితవైకుంఠపురవాస మంజుహాస
భరితమృగమదతిలక సత్ఫాలఫలక
ఘనకృపాసాంగ కుజనాళి గర్వభంగ
భక్తచిత్తాబ్జభృంగ శ్రీపాండురంగ॥

సీ॥ ఫాలాక్షకమలసంభవ సురేంద్రస్తుత్య
ఘోరాజినిర్జిత క్రూరదైత్య

గీ॥ మానిజనపోష మృదుతర మంజుభాష
కలుషసంహార మత్తారిఘనసమీర ॥ఘు॥

సీ॥ ఇందిరావరసదానంద నందకుమార
మారసుందర నిర్జితారివీర
వీరదానవభటధారుణీ ధరశక్ర
శక్రాదిసురనుత చరణపద్మ
పద్మజ జనకతాపస లోకపరిపాల
పాలాక్షసన్నుత భాసురాంగ
అంగనాజన మనోహర దాసపూజిత
జితమహాంహోబాబృంద శ్రీముకుంద
గీ॥ కుందసన్నిభ రదన రాకేందువదన
ధనదసుతయుగ్మ ఘనశాపదళననిపుణ ॥ఘు॥

సీ॥ శ్రీధరావినత గంగాధరాధృతధారు
ణీ ధరా మాన్యనాబాధలెల్ల
బాపెదో లేక నన్నే చెదోవిడనాడఁ
జూచెదో నాకేమితోచదాయె
రక్షకా నవనీతభక్షకా మదదైత్య
శిక్షకా యేలనుపేక్ష సేయ
మానరాచలము నీదానరా నీభక్తి
మానరా నేనింక గానలోల
గీ॥ భవ్యచారిత్ర సుచరిత్ర పద్మనేత్ర
వదనజితసోమ కంసాదివైరిభీమ ॥ఘు॥

సీ॥ వారిజదళనేత్ర వైకుంఠపురవాస
వాసవార్చిత పాదవనజయుగళ
గళధృతనవరత్నకలితహార వ్రజ
వ్రజసుందరీ మనోంబుజదినేశ

ఈశపురోగాఖిలాశాధిపావన
పావనజీవనాస్పద పదయుగ
యుగవిగమోపాత్త యోగనిద్రాముది
ముదితాఖిలజన మోహనికర
గీ॥ కరధృతదరారి సాధనోత్కర నికృత్త
నిఖిలలోకైకకంటక నికరశీర్ష ॥ఘు॥

సీ॥ చాలురా యీచలంబేలరా నీభక్త
రాలరా నందగోపాలబాల
కోపమా నేఁజేయుపాపమా పరితాప
మాపుమా నీకృపచూపుమింక
నేరమా యిటఁజేర దూరమానను బ్రోవ
భారమా మారశృంగారనీకు
కష్టమానను బ్రోవ నష్టమా నాదుర
దృష్టమా తెల్పువిస్పష్టముగను
గీ॥ పంతమేలర శ్రీరమాకాంతనీకు
నెంతవేడినఁ గరుణ రాదింతయైన ॥ఘు॥

సీ॥ శ్రీకరాశత్రు హృద్భీకరా దివ్య ప్ర
భాకరాసన్ముక్తి నాకొసంగు
దూషణాదికదైత్య శోషణానవరత్న
భూషణా వేగనా దోషముడుపు
సుందరావైకుంఠ మందిరావరకంబు
కంధరానీవు నాయందయుండు
పాలకా మంజునీలాలకా గోపాల
బాలకా నేడునా జాలిమాన్పు
గీ॥ అన్యమెరుగను నీదుపాదాంబుజములె
శరణమనినమ్మి వేడెదఁ బరమపురుష ॥ఘు॥

సీ॥ అరయనావాక్యంబు లపశబ్దములెయైన
చాల నేపాపాత్మ్రగాలనైన
రమణ ఛందోలక్షణము లెరుంగకయున్నఁ
దగినపెద్దలుచూచి తప్పులన్న
నతిశుంఠలగువారు హాస్యంబొనర్చిన
నలరేగి శఠులెల్ల నవ్వుచున్న
ధ్వనిగుణరీతి పాకనిరూఢిలేకున్నఁ
గడకదోషములెన్ని గల్గియున్న
గీ॥ సర్వరక్షకనీదు సంస్మరణగానఁ
దలపనిదియొందుఁ గడుఁ బవిత్రంబుగాదె ॥ఘ॥

సీ॥ దేవకీవరపుత్ర త్రిభువనస్తుతిపాత్ర
జలజసన్నిభనేత్ర శరణు శరణు
గోవర్ధనోద్ధార గోపాంగనాజార
చాణూరమర్దన శరణు శరణు
గాజితాంబుదవర్ణ రత్నకుండలకర్ణ
వరకృపాపరిపూర్ణ శరణు శరణు
హృతపూతనాప్రాణవితత దివ్యకృపాణ
శరణాగతత్రాణ శరణు శరణు
గీ॥ శరణుసొచ్చిన కడుదీనజనులగావ
నరయనీకంటె దైవమీయవనిఁగలడె ॥ఘ॥

సీ॥ నీమాయగనలేక నీలకంధరుఁడునిన్
భామగాఁదలపోసి పరువులెత్తె
నీమాయగనలేక నీరజగర్భుండు
తవిలినిన్మదినిల్పి తపమొనర్చె
నీమాయగనలేక నిర్జరనాథుండు
శిలలనుగురియించి సిగ్గునొందె

నీమాయగనలేక నిఖిలప్రపంచంబు
భ్రమసి సంసార బంధమునఁజిక్కె

గీ॥ నిట్టినీమాయఁ దెలియఁగా నెవరికైనఁ
దరమె భావించిచూడఁ నీధరణియందు॥ఘ॥

సీ॥ చతురాత్ములైన పండితముఖ్యులకెగాక
కామినీజనులేడ కవనమేడ
ధృతిశీలులగు భాగవత జనులకేగాక
కామినీజనులేడ కవనమేడ
వివిధశాస్త్రపురాణ వేత్తలకేగాక
కామినీజనులేడ కవనమేడ
వితతనవోన్మేష మతిమంతులకెగాక
కామినీ జనులేడ కవనమేడ

గీ॥ వర్ణనముసేయుటకు నాకు వశముగాదు
భావమునఁ దోచినంతనిక బ్రస్తుతింతు॥ఘ॥

సీ॥ మత్తకంసద్విపమూరణ పంచాస్య
కాళియగర్వాంధకారసూర
దర్పితపౌండ్రిక సర్పాధి పసుపర్ణ
సాళ్వరాజాబ్జాత సామజేంద్ర
ఘోరతృణావర్త గోత్రామరేశ్వర
చైద్యఘనాఘన చండపవన
దంతవక్త్రారణ్య దావానలజ్వాల
బకదైత్యపాదప పటుకుఠార

గీ॥ పావనమనోజ్ఞ దేవకీదేవిజఠర
క్షీరసాగరసంపూర్ణ శీతకిరణ॥ఘ॥

సీ॥ హరిభక్తులెల్ల మాకాత్మబాంధవులైరి
దుర్మదాంధులు కడుఁదూరమైరి
కమలాక్షుకథలు కర్ణములకింపుఘటించె
నితరులకథలసహ్యతఘటించె
మానసిజగురుడన్న మదిసంతసమునొందె
వేఱన్నచిత్తంబు వేట్కడించె
శ్రీశునిఁగొనియాడ జిహ్వకురుచియయ్యె
పరులవర్ణన విషప్రాయమయ్యె
గీ॥ ఎట్లుజూచిననాదైవమీవెగాన
మానసంబున నీకృప మానవలదు॥ఘ॥

సీ॥ నినునమ్మియుంటి నే నీదాసనంటినే
పలుకరా పలుకరా పద్మనాభ
వినుతింపుచుంటినే విడనాడనంటినే
కావరా కావరా ఖగతురంగ
తడవేలనంటినే దయఁజూడుమంటినే
చూడరా చూడరా సురశరణ్య
యభయమిమ్మంటినే యలుకేలనంటినే
మానరా మానరా మౌనివంద్య

గీ॥ నీవ శరణంబు నాకిఁక నిక్కముగను
బ్రోవు బ్రోవుము మ్రొక్కెద దేవదేవ ॥ఘ॥

సీ॥ వనధికన్యాచిత్త వనజాత వనజాప్త
వనజాప్తతేజపావన చరిత్ర
వనచరీత్రాణ సద్భక్త బృందావన
బృందావనవిహార సుందరాంగ
సుందరాంగద మిత్రవిందామనోహరా
హరవిధిప్రముఖ దేవార్చితపద

పదనమధ్భక్త సంపాదిత నిఖిలార్థ-
నిఖిలార్థ- బోధన నిపుణధిషణ

గీ॥ ధిషణ ముఖవిబుధస్తుత దివ్యమహిమ
హిమగిరీంద్రసుతా మనః కమలవాస॥ఘు॥

సీ॥ ఖండితాఖిలదోష పండితపరితోష
వివిధరత్నవిభూష విఠ్ఠలేశ
సదమలచారిత్ర సజ్జననుతిపాత్ర
విమలాబ్జదళనేత్ర విఠ్ఠలేశ
కరుణానివేశ భీకరదైత్యగణనాశ
విదళితభవపాశ విఠ్ఠలేశ
శ్రీకరాకారయాశ్రిత పాపపరిహార
వీరావతార శ్రీవిఠ్ఠలేశ

గీ॥ విహగవల్లభవాహన విఠ్ఠలేశ
వివిధ భువనైక మోహన విఠ్ఠలేశ ॥ఘు॥

సీ॥ గోపాలకృష్ణ శ్రీగోవిందయందునో
బలసహజాయంచుఁ బలుకవలెనో
దేవకీసుత వాసుదేవ యటందునో
పీతాంబరాయంచుఁ బిల్వవలెనో
నరమిత్ర రుక్మిణీ నాథాయటందునో
యచ్యుతకమలాక్ష యనవలయునో
అటుఁగాక సత్యభామాధిప యందునో
దానవాంతక యంచుఁ దలతునో కో

గీ॥ తెలుపవే నాకుఁ దయతోడఁ దేటపడగ
కంసమర్దనయో ద్వారకా నివాస ॥ఘు॥

సీ॥ అధికుండవీవని యలరుచు మ్రొక్కితిఁ
గోపంబునొందకు పాపరహిత
దయగల్గవలెనని దండంబు వెట్టితిఁ
గోపంబు నొందకు కోమలాంగ
నాతండ్రిగా నెన్ని నతులాచరించితిఁ
గోపంబునొందకు కుధరభరణ
భయభక్తులేపారఁ బ్రణుతియొనర్చితిఁ
గోపంబునొందకు కుజన హరణ

గీ॥ అన్యులను వేడ నాదుచిత్తాబ్జమందు
నమ్మునామాట నేను నీసొమ్ము సుమ్ము॥ఘు॥

సీ॥ కమలారి ధరమిత్ర కారుణ్యరసపాత్ర
కమలాకళత్ర నన్గరుణఁజూడు
కుంతలజితభృంగ క్రూరదానవభంగ
ఖగరాట్తురంగ నన్గరుణఁజూడు
బాలేందుసమఫాల భాసురసుకపోల
కరిరాజపాల నన్గరుణఁజూడు
మునిమానస విహార ముర దైత్య సంహార
కనకాద్రిధీర నన్గరుణఁజూడు

గీ॥ ఖండితాఖిలరిపుబృంద కరుణఁజూడు
కలుషసంహార గోవింద కరుణఁజూడు ॥ఘు॥

సీ॥ అధికక్షుధార్తుల కన్నంబిడినఁజాలు
సంతర్పణంబులు సలిపినట్లె
తనదునేరంబులు తాఁ దెలిసినఁజాలు
పరులకు బుద్ధులఁ గరపినట్లె

శిష్టజనాళికి సేవఁజేసినఁజాలు
వెలయఁదీర్థములఁ సేవించినట్లు
మునుకొని దుర్గుణంబులమానిననుఁ జాలు
ఘనసద్గుణములెల్లఁ గలిగినట్లు

గీ॥ పొందుగా మానసము నిన్నుఁజెందియున్న
కోటిదైవములనుఁ జేరి కొలచినట్లు॥ఘ॥

సీ॥ మోక్షమిచ్చెదవని మ్రొక్కితేనామీఁద
పంతమేలరనీకు పాండురంగ
నాస్వామి నీవని నమ్మినుతించితే
పంతమేలరనీకు పాండురంగ
దేవదేవుడవని సేవలొనర్చితే
పంతమేలరనీకు పాండురంగ
బ్రోచెదవనినీదు పూజఁగావించితే
పంతమేలరనీకు పాండురంగ

గీ॥ పరగదీనులఁ బ్రోచెడిబిరుదుఁ గలిగి
పంతమేలరనీకు నోపాండురంగ ॥ఘ॥

సీ॥ అనుదినమునునిన్ను వినుతిసేయుటఁ జాలు
తలపోయఁగా ఘోర తపములేల
ఆశతోనీకథ లాలకించుటఁ జాలు
వేయుపురాణముల్వినఁగనేల
పట్టిజీవుల హింసఁబెట్టకుండుటఁ జాలు
గట్టిగా సత్రిముల్వెట్టనేల
పరధనంబింతైనఁ బట్టకుండుటఁజాలుఁ
బరులకిచ్చెదననిఁ బలుకనేల

గీ॥ దేవదేవుడవీవనుఁ దెలివిజాలు
దేవతలఁ జూడఁ దేశముల్దిరుగనేల ॥ఘు॥

సీ॥ నీపదస్మరణముల్ నెరిదుఃఖహారణము
లలుపాబ్ధి తరణముల్గమలనాభ
నీమీఁదఁగలభక్తి నిజము మేలగుయుక్తి
ఘనమైన సన్ముక్తి కామజనక
నీదుచారిత్రముల్నిర్జరస్తోత్రముల్
పులకితగాత్రముల్పురుషవర్య
నినుఁగూర్చుపాటలు వినుటకునీటులు
సుకృతంపుమూటలు శుభచరిత్ర
గీ॥ నిన్నుబాయఁగ లేనయో నిమిషమైన
నన్నుదరిజేర్చి రక్షించు కన్నతండ్రి ॥ఘు॥

సీ॥ నీ తలన రత్నకిరీటంబు మెరయంగ
లలితంపుమణి కుండలంబులూఁగ
తీరైనకస్తూరి తిలకంబుఁజారంగ
కరముల శంఖ చక్రంబులమర
ఘనమగు కౌస్తుభమణి ప్రకాశింపగ
రమణీయ్య హేమాంబరము చెలంగ
వనరాశికన్యక వక్షస్థలినివెల్గ
గజ్జలుపదములఁ ఘల్లుమనగ
గీ॥ మించి చనుదెంచి నామొరాలించినాదు
చిత్తజలజమునను నివసింపుమయ్య ॥ఘు॥

సీ॥ శ్రీపాండురంగ నీసేవయొనర్చినఁ
దాపంబు పాపంబుఁ దలగిపోవు
శ్రీపాండురంగ నీసేవయొనర్చినఁ
జ్ఞానంబునూనమై ఘనత కెక్కు

శ్రీపాండురంగ నీసేవయొనర్చిన
భక్తియుక్తులు మదిఁబ్రభవమందు
శ్రీపాండురంగ నీసేవయొనర్చిన
దోషంబు రోషంబు దొలఁగుగాదె
గీ॥ దేవదేవేశ నీపాదసేవవలన
మోదమలరంగఁ గడపట మోక్షమొదవు॥ఘు॥

సీ॥ మత్స్యావతారనా మనవిఁగైకొనవేమి
కమఠావతార నన్నావవేమి
వారాహరూప నావగపుమాన్పవదేమి
నరసింహ్మ బ్రోవకున్నావదేమి
వటురూపనాదు లంపట మానుపవదేమి
భార్గవరామ కోపంబదేమి
శ్రీరామచంద్రనా చింతమాన్పవదేమి
బలరామ పిలిచినఁ బలుకవేమి
గీ॥ శ్రీమహాబుద్ధరూప రక్షింపవేమి
కల్కిరూప నీదగు కృపఁ జిల్కవేమి ॥ఘు॥

సీ॥ భృంగంబునవలెఁ జేడుపుష్పశ్రేణిగతిఁ గ్రోలుఁ
గాజుపత్రి మకరందములను
జుంటీఁగలనుబోలె జోకగ తేటుగూర్చు
మానుగామధురంపు తేనెగడ్డ
హంసతీరున బకంబరసి యొగతిఁద్రావు
నంబువుల్వీడఁచి మేలైనపాలు
శుకములకైవడి సొంపుగానేపల్కు
వాయసంబులు మంచి వాక్యములను
గీ॥ జలజదళనేత్ర నీభక్త జనులభంగి
పాతకులకెట్లుగల్గు నీపాదభక్తి ॥ఘు॥

సీ॥ అక్రూర విజయ రుక్మాంగదాదులనెల్లఁ
గరుణఁజూచిన మహాఘనుఁడవీవు
వ్యాసవాల్మీకి దూర్వాసాదులకు నెల్ల
ముక్తిమార్గంబిచ్చుమూలమీవ
నందునిసతికి మన్ననతోడ ముఖమునఁ
జగములఁ జూపిన జాణవీవ
రాణించు వ్రేపల్లె రమణులచిత్తంబు
లపహరించినయట్టి హరివినీవ

గీ॥ యాలమున మగధాధిపుఁడాది నృపుల
బింకములడంచి వెలుగొందు బిరుదవీవ॥ఘ॥

సీ॥ జగముల నినుబోలు జాణలేదనిగదా
యిబ్బంగి నిన్నాశ్రయించుటెల్ల
వెదకిననీవంటి వేల్పులేడనికదా
వచ్చినీమరుఁగిట్లు జొచ్చుటెల్ల
నినుబోల్దయాంశాలి నెందుగానకఁగదా
వేట్కతోనభయంబు వేఁడుటెల్ల
నీచరిత్రంబెల్ల నిక్కువంబనికదా
నన్నుఁగాచెదవని నమ్ముటెల్ల

గీ॥ కన్నతండ్రివై నీమదిఁ గరుఁగకున్న
పరులకికనేలఁ దయగల్గుఁ బరమపురుష॥ఘ॥

సీ॥ ఉపవాసములుసేయ నోపనే నినుమంత
దానంబుసేయ నాతరముఁగాదు
పుణ్యస్థలములకుఁబోవ నాచేఁగాదు
ఘనమైన నదులలో మునుగలేను

మంత్రజపంబులు మరినాకు కొరఁగావు
వ్రతనిష్ఠ సలుప నావలనఁగాదు
మేరదప్పక సదాచారంబు నెరుఁగను
చిత్తంబు నీపైనఁ జేర్పలేను

గీ॥ ఇట్టిపాపాత్మురాలి నన్నేవిధమునఁ
గరుణజూచెదవో గాని పరమపురుష ॥ఘు॥

సీ॥ వనజాక్ష నీకు వందనము చేసినతలల్
సేయనేరకయున్నఁ జెడ్డ శిలలు
గోపాలకృష్ణనిన్గొనియాడునవినోళ్లు
కొనియాడకున్నవి గోడగూళ్లు
శ్రీనాథనిన్ను వీక్షించిననక్షులు
వీక్షింపకున్న గవాక్షులరయ
ఘనముగానీకథల్ వినుచున్న యవిచెవుల్
కూర్మితో వినకున్నఁ గొండగవులు

గీ॥ అరయగా నినుఁ జెందినది మనంబు
చెందకుండినయది ముండ్లచెదువనంబు

సీ॥ కృష్ణ కృష్ణాయని కోకలువడయంగఁ
గృష్ణ కృష్ణాయేను కృష్ణఁగాను
రామరామాయని రహిముక్తినొందంగ
రామరామా బోయభామఁగాను
హరిహరియని వేడియరినడగింపంగ
హరిహరియే నలకరినిఁగాను
గోవిందయనినిన్ను సేవించిబ్రతుకంగ
గోవిందనేఁ గుంతికొడుకుఁగాను

గీ॥ ఎలమి నినుఁగొల్చువారిలో నెవరఁగాను
నెటులనను దయఁజూచెదో యీశ్వరేశ ॥౩

సీ॥ మాధవకథలు సమ్మతితోడ వినువారు
హరిమందిరంబున కరుగువారు
పక్షిరాడ్గమనుని పదభక్తిగలవారు
తోయజాక్షునిపూజ సేయువారు
గోవిందునెప్పుడు గొల్చుచుండెడివారు
దేవదేవునికథల్ దెల్పువారు
పురుషోత్తముయటంచు స్మరణచేసెడివారు
మురవైరివీక్షించి మ్రొక్కువారు
గీ॥ పరమపుణ్యులు సజ్జనుల్ భవ్యమతులు
వారిపాదంబులకుఁ జేతు వందనములు॥ఘు॥

సీ॥ పరులసొమ్ములకాస పడియెడివారలు
పరసుందరులఁగాంచి బ్రమయువారు
పరనిందలోయక పలుమారు వినువారు
పరుల నెప్పుడుదూరఁ బలుకువారు
పరులదండనకయి బహుచింతపడువారు
పరులనేరముఁగోసి పట్టువారు
పరధర్మములకు సొంపలరఁ మెచ్చనివారు
పరులెఱుంగక భువిఁ బ్రతుకువారు
గీ॥ దురితకర్ములు దుర్జనుల్ దుష్టమతులుఁ
గానవారలకిహపరగతులుగలవె॥ఘు॥

సీ॥ మిక్కిలి కలకంఠ నొక్కటవిడనాడి
తీపనివేపాకుఁ దినినరీతి
మేలైన మొదవుల పాలనువిడనాడి
యుప్పునీళ్లనుదాగ్రివు చొప్పుగాగ

చెన్నుమీఱినమంచి చెరుకును బోద్రోచి
నయమనియొకకోల నమలురీతి
బాగైన ఖర్జూర ఫలమునువర్జించి
కోరిముష్టిఫలంబుఁ గుడుచురీతి
గీ॥ పావనంబైన నీపాదభజనవీడి
మొనసి పరదైవతములకుఁ మ్రొక్కువెల్ల॥ఘ॥

సీ॥ సభమెచ్చెననిచాల సంతసింపఁగరాదు
విభవంబునమ్మి గర్వింపరాదు
తల్లిదండ్రులమీదఁదప్పులెన్నఁగరాదు
భూసురోత్తములతోఁ బొంకరాదు
పొరుగువారిండ్లకెప్పుడు పోవగారాదు
మత్తిల్లి సుగుణముల్ మఱువరాదు
సరగునజీవహింసకుఁ బాల్పడఁగరాదు
చెడువారితోఁ జెల్మిసేయరాదు

గీ॥ సరవిఁబెద్దలహాస్యంబు సలుపరాదు
వేయుశ్రమలున్న నీభక్తి విడువరాదు॥ఘ॥

సీ॥ తిరమొప్ప వేముకుఁ దీపుపుట్టినగతి
పరగకుందరపంట పండినట్లు
నుల్లికిమేల్తావి యొదవినకైవడిఁ
జీమపునకు దృష్టి చేకురుగతి
కోకిలాలాపంబు కోడికబ్బినరీతిఁ
జెలఁగి మేడికిఁబువ్వుగలిగినట్లు
బొగ్గు కస్తూరియై పొలుపుఁగాంచినరీతి
చిలువకు నమృతంబు కలిగినట్లు
గీ॥ మానసంబునదుర్నీతి మానవలేని
పాపికిని నాకు నీ నామ భజనగల్గె॥ఘ॥

సీ॥ తలిదండ్రులున్న నందను లెంగరుండినఁ
దనువువిడచునాడు తరలిరారు
తమకించి యెంత విత్తముఁగూడఁబెట్టిన
మానవులకు నాస మానఁబోదు
కడుపునకై పట్టి కష్టములేగాని
చూడగాఁ బుణ్యమించుకయు లేదు
దుష్కార్యములఁజేయఁ దోఁచెడినేగాని
మంచికార్యంబను మాటలేదు

గీ॥ చాలు సంసారమిక జన్మజన్మమునకు
స్వామినీదాస్యమే నాకొసంగుమయ్య॥ఘ॥

సీ॥ బహుసంపదలఁజూచి బాంధవులనుజూచి
తనయులఁగాంచి సంతసమువించి
ధాన్యరాసులఁజూచి తరుణీమణులఁజూచి
వాహనంబులజూచి వాంఛఁజెంది
భృత్యవర్గముఁజూచి భోగంబులనుజూచి
మందిరంబులఁజూచి మమతనొంది
తగుప్రభుత్వముఁగాంచి తనశౌర్యమెదనెంచి
మదిలోనహర్షించి మదమువించి
గీ॥ నిక్కమని దేహమునునమ్మి నిన్నుమరచి
తుదకు ఫలమేమిఁ గాంచునో దుర్జనాళి॥ఘ॥

సీ॥ శ్రీయుతంబుగనీదు సేవయొనర్చినఁ
గామితార్థములెల్లఁ గలుగుచుండు
నుల్లంబునందు నిన్నల్లనఁ దలఁచిన
నజ్ఞానమోహంబు లణఁగుచుండు
నోరూరనిన్ను నింపారనుతించినఁ
గాలుచేసగుభీతిఁ దూలుచుండు

నతిభక్తిఁ జేసీకు నతులొనరించినఁ
వెసభవబంధముల్వీడుచుండు

గీ॥ నిన్నిసౌఖ్యంబులానఁగెడి నిన్నువీడి
యొరులఁగొలిచిన సౌఖ్యమేకరణిఁగలుగు॥ఘ॥

సీ॥ బలమెంతగలిగిన భాగ్యంబుగలిగినఁ
దోడనొక్కటియునుగూడిరాదు
కాపివ్వముల్జేసిన కూపిరకర్మంబులు
గాసిపెట్టునుగాని వాసిపోవు
కాయమెవ్విధమునఁ గాచిరక్షించిన
నిక్కమీధరణిపై నిల్వఁబోదు
సౌందర్యములును నెంచగఁ జమత్కారముల్
కాలంబునందునక్కరకురావు

గీ॥ ఇట్టివ్యర్థంపు కోరికలెల్లఁవీడి
దిట్టమగుభక్తి నిన్ను నుతింతునేను॥ఘ॥

సీ॥ విష్ణుభక్తులమోము వీక్షించినంజాలు
సుకృతహీనుల మోముఁజూడరాదు
హరిదాసులకుదండ మర్పించినంజాలు
దురితకర్ములచెంత కరుగరాదు
పుణ్యమానసులను బూజించినంజాలు
పాపాత్ములను నోటఁబలుకరాదు
భాగవతులతోడ భాషించినంజాలు
కూపిరులతోఁ జెల్మిఁగోరరాదు

గీ॥ హితముగా నీకు వందనంబిడినఁజాలు
నిక్కముగ నితరులకిక మ్రొక్కరాదు॥ఘ॥

సీ॥ ఆలోచనంబు లెన్నైన నేర్వఁగవచ్చు
నిన్ను నాలోచింప నేర్చుటరుదు
అకటదుర్భాష లెన్నైనను వినవచ్చు
నీకథలను విననేర్చుటరుదు
షడ్రసంబుల రుచి సరగునఁ గనవచ్చు
నీనామరుచిఁ గననేర్చుటరుదు
దర్పాంధులనుగని దండంబు లిడవచ్చు
నీకు దండము వెట్ట నేర్చుటరుదు

గీ॥ సుంద రాంభాసులగువారిఁ జూడవచ్చు
నీరజోదర నినుజూడ నేర్చుటరుదు ॥ఘు॥

సీ॥ పన్నగశయన సన్పాలింపుమంటిని
గరుడవాహనన్ను గావుమంటి
దేవనన్గావ నీదే భారమంటిని
వేరుదైవంబుల వేడనంటి
లోకంబులెల్ల నీలో నుండునంటిని
దలపోయ నీవు నాతండ్రివంటి
కోపించి నన్ను జిక్కులు వెట్టకుమటంటి
సంతరించుట కిదే సమయమంటి

గీ॥ మతములిక నేమియును లేక మానియుంటి
నభవననుబ్రోవుమనుచు నిన్నడిగికొంటి ॥ఘు॥

సీ॥ బ్రతుకున కెవ్వారి బ్రతిమాలవలయునో
యే వేళ కేకష్టమింకఁ గలదొ
దొరకొని యెట్టివ్యాధులు సంభవించునో
కాయమేస్థలమందుఁ బాయనగునొ

అటఁజిత్రగుప్తుఁడేమని వ్రాసియుండునో
యలకృతాంతుండెట్టి యాజ్ఞయిడునొ
యమభటులెంత భయంకరాకారులో
బెట్టుగా నెటుబాధఁబెట్టఁగలరొ

గీ॥ దైవమా యిట్టికష్టముల్ దలచితలచి
యిన్నిఁదొలగింప నిన్నాశ్రయించుదాన ॥ఘ॥

సీ॥ కడుఁదుష్టులనుగూడి చెడఁగలంచితిఁగాని
భాగవతులపంచఁ బట్టనైతి
తీరినపొరుగిండ్లఁ దిరిగితినేఁగాని
పరమాత్మహరియని పల్కనైతి
నయ్యయో దుర్భాషలాలకించితిఁగాని
హీనులసీకథల్ వినకపోతిఁ
దనువుస్థిరంబని దలచితినేగాని
నిజముగాదనియెంచ నేరనైతి

గీ॥ మానుగా దుర్గుణంబుల మాననైతి
నిష్ఠతో మదినిన్ను ధ్యానింపనైతి ॥ఘ॥

సీ॥ ఎవ్వనిపాదమందెల్ల లోకంబులఁ
బావనంబొనరించు పాపపుట్టె
నెవ్వనినాభియందిరవందగాఁ జతు
ర్వదనముల్గల పిన్నవాఁడుగల్గె
నెవ్వనియురమునం దెల్లలోకములకుఁ
గలుములనొసగెడు కాంతనిలిచె
నెవనికన్గవ రేయుఁబవలు లోకమునెల్లఁ
దెల్వొనొందించుచుఁ దేజమందె

గీ॥ నట్టిలోకైకనాయకునప్రమేయుఁ
బరమపురుషుని నామదిఁ బ్రస్తుతింతు ॥ఘు॥

సీ॥ వనజాక్షనీవుపోషింపక యుపేక్షించిన
పాపజాతియటంచుఁ బల్కుచున్నఁ
గువలయేశ్వరనీకుఁ గోపంబుగల్గిన
గట్టిగాఁబలుమారుఁ గసరుకొనినఁ
జాలనన్నిడుమలపాలు గావించిన
దీనభావంబు జెందింపుచున్న
బహువిధంబులనిందఁ బడునట్లుచేసినఁ
దివిరిబల్గాసి నొందింపుచున్నఁ

గీ॥ బంతమలరంగ నిన్నె సేవింతుఁగాని
విహగవాహన నీభక్తి విడువఁజాల ॥ఘు॥

సీ॥ అబ్జజుండొసఁగిన యాయుష్యమందుల
సగమునిద్దురకయి సమసిపోయె
నలయున్న సగము లోపలబాల్యమందున
నాటలతోడఁ గొన్నాళ్లుజరిగె
మఱియౌవనంబున మమతకులోఁబడి
చెనటికర్మంబులఁ జేయనాయె
నంతట సంసారమను జలరాశిలో
తిరమెఱుంగకమున్గి తేలనాయె

గీ॥ కాలమెల్లను నిబ్భంగిఁగడచిపోయె
ముదిమిదాపాయె దుర్వాంఛవదలదాయె ॥ఘు॥

సీ॥ చెలఁగి పాంచాలికిఁ జీరలిచ్చిననాటి
కరుణయెందఱిగె నోకమలనాభ

మకరంబుద్రుంచి సామజరాజునేలిన
కృపయెందడంగెనో నృపలలామ
కడుపడిఁబ్రహ్లాదుఁగాఁచిరక్షించిన
దయయెందుఁజొచ్చెనో దనుజవైరి
గణుతింప నావిభీషణుని జేపట్టిన
నెనరెందుఁబోయెనో నీరజాక్ష

గీ॥ దిక్కు నీవని నమ్మిన దీనురాలి
నిక్కముగఁబ్రోవ విదియేమి నిగమవేద్య ॥ఘ॥

సీ॥ ఫలపుష్పహీనమై పరగువనంబేల
తావిలేకుండినపూవులేల
జలహీనమైనట్టి నళినాకరంబేల
వేల్పులేనట్టి కోవెలయదేల
పతిమాటమీరిన భామగౌరవమేల
దానమించుకలేని ద్రవ్యమేల
సద్గుణంబులులేని చక్కదనంబేల
మఱినీతిమాలిన మాటలేల

గీ॥ రహినిదారాధిపతిలేని రాత్రియేల
నిన్నుఁగొనియాడఁ జాలనినేర్పులేల ॥ఘ॥

సీ॥ కమలమిత్రుఁడు ప్రాచిఁగనుపట్టెనేనియుఁ
దిమిరంబులుండునా దీనపోష
విహగేంద్రుఁ గనులార వీక్షించినంతనే
యురగంబులుండునా శరధిశయన
ఘనమారుతమువీవఁగానె చలింపక
మేఘంబులుండునా మీనరూప

సరవితోడుతను గేసరిఁబొడఁగాంచినఁ
గరులందునిల్చునా దురితదూర

గీ॥ నీపదాంబుజముల భక్తి నిలిపికొలుచు
నరులఁబాపంబులొందునా నళిననాభ ॥ఘ॥

సీ॥ ఇందిరావల్లభ యింక నైనను నన్నుఁ
గానవే నేఁజేయు కర్మమేమొ
కుటిలారిమర్దన గొనకొనివేడితిఁ
బాలింపవే నాదు పాపమేమొ
నీలాంగ ననుఁగావ నీవిటురమ్మనఁ
బలుకవే నాకాశ్రితఫలమదేమొ
కరుణనామీఁద నిక్కమువేశమైనను
దలపవే నీకిఁక ధర్మమేమొ

గీ॥ నీకు నాపయినిక దయరాకయున్న
నేఁడు నేనిక నెవ్వరి వేడుదాన ॥ఘ॥

సీ॥ అనుదినంబును నీళ్లమునిఁగిన ఫలమేమి
ధౌతాంబరంబులఁ దాల్పనేమి
హరిణాజినంబున నధివసించిననేమి
యొడలెల్లభస్మంబు నిడిననేమి
జపమాలికలుచేత సరగఁదాల్చిననేమి
కన్నుంగవమొగిడ్చియున్ననేమి
అన్యులతో మాటలాడకుండిననేమి
కొన్నిమంత్రంబులఁ గొణగనేమి

గీ॥ కపటమొప్పారు మనమునఁ గలుగువారు
లేశమైనను నీభక్తి లేనివారు ॥ఘ॥

సీ॥ దివ్యసుందరగాత్ర దినకరశశినేత్ర
భవ్యచారిత్ర శ్రీపాండురంగ
మందరగిరిధర మాణిక్యయుతహార
భక్తమందార శ్రీపాండురంగ
సారసపత్రాక్ష సమదదానవశిక్ష
భద్రేభరక్ష శ్రీపాండురంగ
ఇందిరాహృదయేశ వందారువాణీశ
బహుదుఃఖనాశ శ్రీపాండురంగ

గీ॥ పతగరాజతురంగ శ్రీపాండురంగ
పాతకాబ్జాత మాతంగ పాండురంగ ॥ఘ॥

సీ॥ నీదివ్యనామంబు నిర్జితకామంబు
శాత్రవభీమంబు చక్రహస్త
నినునమ్ముకొనియుంట నిఖలపుణ్యముగంట
తలపనోములపంట దైవరాయ
నిన్నాలకించుట చెన్నురహించుట
యమునిజయించుట కమలనయన
నీపాదయుగసేవ పాపాంబుధికినావ
ముక్తికల్లదెత్రోవ భక్తపాల

గీ॥ కాన నినుమానసంజాల నిక్కంబుగాను
నిమురలో నైన శ్రీకామినీసమేత ॥ఘ॥

సీ॥ దండికింకరకూర దండనంబెడబాపు
దండమర్పింతు వేదండవరద
తాపత్రయంబెడబాపి సంరక్షించు
నీసేవయొనరింతు భాసురాంగ

దోషంబులెల్లను దొలఁగఁజేసెడినిను
నమ్మినానయ్య శ్రీనారసింహ
గాసిబెట్టఁగ మేరగాదుర నీకంటె
దిక్కెవ్వరున్నారుదీనపోష

గీ॥ సుందరాకార సంతతానందధీర
జలధిగంభీర పాషండజనవిదూర ॥ఘ॥

సీ॥ స్త్రీజనంబులను రక్షింపగాదంటివా
పరగగౌతమపత్ని తెరవగాదె
కల్మషాత్ములఁబ్రోవఁగారానిచో నజా
మీళుండు కలుషిడై మెలగలేదె
కులహీనులనుబ్రోవఁ గూడదటంటివా
విదురుండు శూద్రుఁడై వెలసెగాదె
నామీఁదదయలేక ననుఁబ్రోవకుంటివా
శరణార్థులనుగాచు బిరుదులేదె

గీ॥ ఎందుకీమాటలెల్లనో యిందిరేశ
తగునెనీకిట్లు నాపాటుదలపకున్కి ॥ఘ॥

సీ॥ పావకజ్వాలలఁ బడకుండునట్లుగా
జెంచులదొరను రక్షించితివని
ద్రోణపుత్రుండేయు బాణంబువారించి
గర్భంబులోఁలుఁబా గాచితివని
దుర్వాసుకోపాగ్నిఁదొసఁగులఁబడకుండ
నంబరీషునిదయ నరసితివని
భావింప నుత్తానపాద తనూజునిఁ
బొందుగాదయతోడఁ బ్రోచితివని

గీ॥ ఘోరపాపాంబునిధి మున్గికుంనుచున్న
నన్ను దరిఁజేర్తువనినిన్ను నమ్మికొంటి ॥ఘు॥

సీ॥ పలుమారుఁ బిలచినఁ బలుకవదేమయా
లోకరక్షక పుండరీకవరద
మొర వెట్టివేడనా మొరవినవేమయా
లోకరక్షక పుండరీకవరద
చూడుమన్ననుదయఁ జూడవదేమయా
లోకరక్షక పుండరీకవరద
దైవతములకిది తగవగునేమయా
లోకరక్షక పుండరీకవరద

గీ॥ రమ్ము కోపమ్ము మానుము నెమ్మనమున
నమ్మినానయ్య నీదుపదమ్ము లెదను ॥ఘు॥

సీ॥ భవసాగరంబునఁ బడిమునింగెడు నన్నుఁ
గరుణించి నీభక్తిఁగలుగఁజేసి
దుర్భాషణములను దొరకొనివినునన్ను
విరివిగానీకథల్ వినఁగఁజేసి
విసువక నరులను వినుతించుచుండునా
నోట నీనామంబు నుడువఁజేసి
విషయేచ్ఛ నెప్పుడు వీడకుండెడునాదు
చిత్తంబు నీయెడఁజెందఁజేసి

గీ॥ తొల్లినేఁజేయు దురితముల్ దొలఁగఁజేసి
కరుణచేఁ జేరవచ్చి నన్గావుమయ్య ॥ఘు॥

సీ॥ వేద్కచే మీనమై వేదముల్ రక్షించి
కూర్మమై మందరకుధరమెత్తి

ఘనసూకరాకృతిఁ గనకాక్షునిజయించి
నరహరివై దైత్య నాథుఁద్రుంచి
నటుఁడవై బలిదైత్యు వసుధక్రిందనణంచి
పరశువుఁబూని భూపతులఁద్రుంచి
దశరథాత్మజుఁడవై దశముఖునిజయించి
హాలపాణివై మహాఖలులఁద్రుంచి

గీ॥ దనుజసతుల పాతివ్రత్యములగలంచి
ఘోటకము నెక్కి మ్లేచ్ఛాళిగీటడఁచితి ॥ఘ॥

సీ॥ పరమాత్మనీదు కృపారసంబునఁగదా
రుద్రుండు త్రిపురాసురులజయించె
పరమాత్మనీదు కృపారసంబునఁగదా
వేదంబులజునకుఁ వేడ్కదొరకె
పరమాత్మనీదు కృపారసంబునఁగదా
ఇంద్రుండు భువనంబులేలఁగలిగె
పరమాత్మ నీదుకృపారసంబునఁగదా
పాండవుల్ శూరులై బ్రతుకగలిగె

గీ॥ పొసగనీదైన సత్కృపారసముచేతఁ
దలపఁగా సర్వశుభములు కలుఁగకున్నె ॥ఘ॥

సీ॥ వదలకసంసార వార్ధియుప్పొంగి న
న్ముంపగఁజొచ్చెనో మునివరేడ్య
అతిశయవిషయేచ్ఛలను దవాగ్నిజ్వాల
లందందననుగాల్చె నందతనయ
మోహోపదేశ జీమూతసంతతులు న
న్నట్టిబాధించెనో కమలనయన

కదలని శోకాంధకారంబు మునుకొని
నను(జుట్టి బాధించె నళిననాభ

గీ॥ వితతగతితరివగుము సువృష్టినగుము
కరువలివిగమ్ము తగనుష్ణకరుఁడవగుము ॥ఘ॥

సీ॥ భువనంబులెల్లను బుట్టింపఁ బెంపన
క్కడలిలో ముంపంగఁ గర్తవీవ
మునిజనంబులునీవ ముక్కంటియునునీవ
సూర్య చంద్రులునీవ సురలునీవ
యష్టదిక్కులునీవ యవనీతలమునీవ
గగనంబునీవ సాగరములీవ
పావకుండునునీవ పర్వతంబులునీవ
యంబుదంబులునీవ యజుఁడవీవ

గీ॥ కమలజాండబు మరినీవ గాడ్పునీవ
యఖిలమునునీవ చింతింపనాదిదేవ ॥ఘ॥

సీ॥ బలురోగములనైన భయముతోనైనను
చిత్తంబులోఁగల్గు చింతనైనఁ
జాలవేడుకనైన గేలిచేనైనను
తీరనిపనుల వేసారియైనఁ
గోపంబుతోనైన గొణుగుచునైనను
భావంబులోఁగల భక్తినైనఁ
బరులచేహింసలఁ బడుచుండియైనను
బేర్మినందనుల పేర్వెట్టియైనఁ

గీ॥ దవిలి నీనామమెట్లైనఁదలచినంత
భానుజుని కింకరుల బాధ బాయకున్న ॥ఘ॥

సీ॥ అతిపాపమతియైన యయ్యజామిళునిఁ
బెలఁగిపుణ్యాత్ముఁగాఁ జేసితౌర
యాదశాస్యుని తమ్ముఁడగు విభీషణునకు
నిరవందగారాజ్య మిచ్చితౌర
యపరాధమొనరించినట్టి కాకాసురుఁ
గరుణించివేవేగఁ గాచితౌర
వేడ్కతో నీకథల్ విననిఘంటాకర్ణుఁ
దిరమొప్ప ముక్తిఁజెందించితౌర

గీ॥ యిట్టి కరుణాంబునిధివి నిన్నెన్నఁదరమె
భక్తమందార యాపద్మభవునికైన ॥ఘ॥

సీ॥ ప్రీతిభృంగములకు బిసరుహంబులయంద
యాకొన్న మనుజుల కన్నమంద
నెరిపేదవారికి నిక్షేపములయంద
బాలురకును దల్లిపాలయంద
వాడుసస్యములకు వర్షసంతతియంద
తగమునీశ్వరులకుఁ దపమునంద
యవనీసురేంద్రుల కతినిష్ఠలందున
నధికశూరుల కెల్ల యాలమంద

గీ॥ సాధులగు భక్తులకు హరిస్మరణయంద
చేరియుండునుజిత్తంబు సారసాక్ష ॥ఘ॥

సీ॥ అల్పవృత్తినిశూద్రు నన్నంబు గుడువవో
గోపాంగనలచేతఁ గొట్టఁబడవొ
కోతులగుంపులోఁ గోరివర్తింపవో
కరమర్థికోటికిఁ గట్టుబడవొ

అరుదుగా మరదికి నరదంబు గడపవొ
తురకనీ౯ దరుమగాఁ బరువులిడవొ
గోచిబాపని యటుకులు వేగమెక్కవొ
యరిభీతినబ్ధిఁ గాపుర మెనయవొ

గీ॥ నీచరిత్రంబులెల్లను నెమ్మనమునఁ
దలచిచూడంగ గడుఁజోద్యములుగదయ్య ॥ఘ॥

సీ॥ తప్పులనోర్వ నాతల్లిదండ్రులునీవ
ప్రీతిసర్వమొసంగ దాతవీవ
మంచిబుద్ధులుచెప్ప మాకుగురుఁడవీవ
తోడయివర్తింప జోడవీవ
పాపంబులెల్లబాపను దైవమవు నీవ
రక్షించుటకు మహారాజవీవ
భావింపగానాదు భాగ్యమెల్లనునీవ
నిఖిలేశనాకు నన్నియునునీవ

గీ॥ అప్ప మాయప్ప నాదురత్నాలకుప్ప
యొప్పుగానీవు నాపాలనుండుమప్ప ॥ఘ॥

సీ॥ అహహా నీదివ్యగేహంబు శ్రీవైకుంఠ
మంబుజసంభవుండాత్మభవుఁడు
శంభుండు చెలికాఁడుఁ జలధికన్యకభార్య
కమలారిభానుండు కన్నులరయ
నిఖలదేవతలును నీపరిచారకుల్
వైనతేయుఁడునీకు వాహనంబు
పన్నగనాథుండు పరగనీతల్పంబు
క్షీరంబురాశినీ యూరుపట్టు

గీ॥ కాన నీకంటెదైవంబు గాననెందు
నీవదిక్కనినమ్మితి నిక్కముగను ॥ఘు॥

సీ॥ హరియని నీదు రెండక్షరంబులుబల్క
రక్కటా బహుభాషలాడఁగలరు
హరికథలన్నచో నాలింపఁజాలరు
విటులసుద్దికిఁ జెవుల్ విప్పగలరు
పక్షివాహనుఁడన్న వీక్షింపఁజాలరు
సుందరాంగనలన్నఁ జూడఁగలరు
కపటదైవముల నిక్కంబంచు నెంతురు
నారాయణుండన్న నమ్మలేరు

గీ॥ పామరులకెల్లనిదియె స్వభావమైన
సుజనులగువారు విడనాడఁ జూడవలదె ॥ఘు॥

సీ॥ కాంచనంబుననుండు కల్మషంబుడుగదే
పటుతరపుటపాక భంగివలనఁ
దండులంబులనుండు తవుడెల్లనూడదే
పొందుగాముసలంపుఁ బోటువలన
మాసినచేలంబు మలినంబు విడువదే
తేటగావిలసిల్లు నీటివలన
పరగంగ వెన్నలోఁ బెరుగెల్లవదలదే
మవ్వంపుఁ గవ్వంపు మథనమునను

గీ॥ జెట్టమదియైననీయందుఁ జెందెనేని
కలుషములువాసి స్వచ్ఛంబుగాకయున్నె ॥ఘు॥

సీ॥ సంసారమనుమహాజలరాశికినినావ
నీనామమేగదా నీరజాక్ష

కామాద్యహిత ఘోరకాంతారదవహ్ని
నీనామమేగదా నీరజాక్ష
తలపదుర్మదమను దావాగ్నికిని వృష్టి
నీనామమేకదా నీరజాక్ష
కలుషంబులను నంధకారంబులకురవి
నీనామమేకదానీరజాక్ష

గీ॥ యిట్టి నీదివ్యనామంబు నిందిరేశ
చిత్తముననిల్పియున్నాను చింతలేల॥ఘు॥

సీ॥ ఖ్యాతిగానిట్టుకరాతిపైఁ బాదకం
జాతకంబుంచినరీతివాఁడు
వలమురిడాచేత వలనొప్పగాదాల్చి
పచ్చనివలువచేఁ బరగువాఁడు
కరమొప్పగారెండు కరపంకజములు శ్రీ
కరకటిస్థలిఁ జేర్చిపరగువాఁడు
వారకమిగుల శృంగారమౌనుదుటఁ
గస్తూరి నామంబుచే మీరువాఁడు

గీ॥ సుందరంబగుచూపులఁ జూచువాఁడు
నట్టి నాకన్నుఁ గవఁ గట్టినట్టులయ్యె॥ఘు॥

సీ॥ అరయంగ నీచరణాంబుజ ధ్యానంబె
యమృతపానంబు శేషాహితల్ప
యేపారభక్తితో నీపూజసేయుట
యఘముబాయుట జగదంతరాత్మ
నిరతంబుమనమున నీమూర్తి గాంచుట
తపముఫలించుట తపనతేజ

తిరముప్పంగా నీదు దివ్యప్రసాదంబు
మదికి మోదంబు తామరసనేత్ర

గీ॥ కాన నీదివ్యనామంబు మానసమున
మరువకేఁ బ్రస్తుతించెద మదనజనక॥ఘ॥

సీ॥ మునుకుచేలునకిచ్చు ఘనమైనసంపద
ల్వల్లవీరమణనే నొల్లనయ్య
యాంజనేయునకిచ్చు నధికాయువైనను
వల్లవీరమణనే నొల్లనయ్య
రాక్షసేంద్రునకిచ్చు రాజ్యసుఖంబైన
వల్లవీరమణనే నొల్లనయ్య
యిరవంద ద్రౌపదికిచ్చిన చేలము
ల్వల్లవీరమణనే నొల్లనయ్య

గీ॥ యెల్లకాలమునాదగు నుల్లమందు
నింపుగా నీవు వసియింపు మింతె చాలు॥ఘ॥

సీ॥ కోటిసూర్యులతోడ సాటైనవరత్న
కోటీరమును దాల్చి కొనినవానిఁ
గరితుండములఁబోలు కరములమణిమయ
కేయూరయుగ్మంబు గెరలువాని
సలలితంబైన వర్షాకాలనీలాంబు
దముభంగి నల్లనితనువువాని
బాగైన తనయురోభాగంబునందు శ్రీ
నళినాక్షి నిధరించి నట్టివానిఁ

గీ॥ గనకమయచేలమును గట్టికొనినవాని
[illegible] ॥ఘ॥

సీ॥ వివరింప దుఃఖాటవీ దావహతంబులు
మోక్షలక్ష్మీచిత్త మోహనములు
మదమోహలోభాబ్జ మదవారణంబులు
గణుతింపగాశుభ కారణములు
పొందుగాసజ్జన బృందావనంబులు
పరికింపఁగాజన్మ పావనములు
పటుతరక్రోధ సంకటవిసర్జనముల
భ్యర్హితబహు సుకృతార్జనములు

గీ॥ నూనుగా యోగిజనులకు మంతనములు
సంతతంబును నీపాదచింతనములు ॥ఘ॥

సీ॥ అడవులఁ జరియించి యాకుభక్షించిన
భూతిమైనిండను బూసికొనిన
రమణరుద్రాక్ష హారములుధరించినఁ
గాషాయవస్త్రము లట్టికొనిన
సదమలహృదయులై స్నానంబుచేసిన
నితరపురాణంబులెన్నివినిన
నతులితముగ నెట్టి వ్రతమాచరించినఁ
బ్రజలు యోగియటంచుఁ బలుకుచున్న

గీ॥ భూధిగానిన్నుఁ గొల్వనెరుంగకున్న
నంబుజోదరయవి నిష్ఫలంబులుగద ॥ఘ॥

సీ॥ నీకాంతశ్రీకాంత నిఖిలలోకములకు
పల్లవితంబుగ సంపదలనొసంగు
నీసుతుండబ్జజుఁడు మహనీతకార్యనిపుణుఁడై
యఖిలజీవులకును నాయువొసఁగు

నీపుత్రి మందాకినీ దేవి భువనముల్
నయము మొప్పఁగాఁ బావనములు సేయు
నీకనుల్ శీతకరనీరజబంధులు
చెలగి రేయుఁబవళ్లు సేయఁగలరు

గీ॥ కల్లుజగముల కెల్లను గర్తవీవ
మందరోద్ధార సనకాది మౌనివంద్య॥ఘ॥

సీ॥ జలజాక్ష నీపాద జలరుహంబులుసోక
నెలకొనిచటాత్రియి నెలఁతయయ్యె
నగభేదినుతనీదు నామఁబుపఠియించి
ముదముతో శబరి సన్ముక్తి గాంచె
శరణార్థిరక్షక శరణునీకనివచ్చి
రావణానుజుఁడెల్ల రాజ్యమేలె
ఖగవాహనాత్రిపదీకాంత నిన్ను నుతించి
పగతులచేభంగ పాటువాసెఁ

గీ॥ గాననీపాద కమలముల్మానసమున
నమ్మియున్నానురక్షించు నళిననాభ॥ఘ॥

సీ॥ పాండురంగాయని పలుమారు పిలచితే
పలుక వేనీకింత పంతమేల
విఠ్ఠలేశాయని వివరించిపిలచితే
వలుక వేనీకింత పంతమేల
రుక్మిణీవరయని యూషిగాఁ బిలచితే
పలుక వేనీకింతపంత మేల
చక్రిపాణీయని సరగునఁ బిలచితే
పలుక వేనీకింత పంతమేల

గీ॥ ప్రేమతో నింతగా నేను బిలుచుచుండఁ
బల్కకున్నావు నీకింతపంతమేల॥ఘు॥

సీ॥ కడుదూరమాటచే ఘనముగా నామొర
వినరాదొ కో నీకు వేదవేద్య
వన గజేంద్రుఁ సిమొర వైకుంఠమందుండి
యేలాగువింటివో నీలవర్ణ
ద్రౌపదీసతిమొర ద్వారకలోనుండి
యేరీతివింటివో సారసాక్ష
ప్రహ్లాదుమాటను పాటించిజగమున
నెటునిండియుంటివి యీశ్వరేశ

గీ॥ యిట్టినీ కెద్ది దెలియదదెంచిచూడఁ
బక్షపాతంబుగాఁ బోలుఁ బక్షివాహ॥ఘు॥

సీ॥ ఎలిమినాదగు మనంబెన రెరుంగకయున్న
నీ వెరుంగ వెనీల నీరదాంగ
జనులకుఁ బన్కిమాలినదాన నైయున్కి
నీ వెరుంగవె నీలనీరదాంగ
పరులుక్రోధంబున నను గేలిసేయుట
నీ వెరుంగవె నీలనీరదాంగ
ప్రజలు నన్నెటువంటి పల్కులునల్కుట
నీ వెరుంగవె నీలనీరదాంగ

గీ॥ నేను మొరవెట్టుచుండుట నీకుఁ దెలియు
శోకతో వినుచుండుట నాకుఁ దెలియు॥ఘు॥

సీ॥ తిమిరంబువాపనాదిత్యుఁ డొక్కఁడేచాలు
నేలకున్గురుపుర్వు లెన్నిమైన

అవనిఁదాల్పంగ శేషాహియొక్కఁడెచాలు
నేలొకో నీరగ్లుంెన్ని యైన
శరనిధిదాటింపఁ దరణియొక్కటెచాలు
నేలొకోయరిగెలవెన్ని యైన
సకలంబొసంగఁ గల్పకమొక్కటియుచాలు
నేలకానుగుమ్రాకు లెన్నియైనఁ

గీ॥ కలుషములఁబాప నీన యొక్కఁడవెచాలు
నేలచింతింప దైవంబులెందరైన॥ఘు॥

సీ॥ ఓజగద్రక్షక యోజగత్కారణ
యోజగన్మోహన యోముకుంద
యోసచ్చిదానంద యోసద్గుణాకర
యోనిత్యకల్యాణ యోపరేశ
యోధరామరనుత యోరవినిభతేజ
యోదీనవత్సల యోదయాబ్ధి
యోపాపసంహార యోసుదర్శనధర
యోసుందరాకార యోమహాత్మ

గీ॥ యన్యమెరుఁగను నీదుపాదాంబుజములు
నాకుదిక్కనిమనమున నమ్మికొంటి॥ఘు॥

సీ॥ అతిసత్యనిరతుఁడౌ నాహరిశ్చంద్రుండు
కష్టపడుటగాక కాంతనమ్మె
కుంతీసుతులు నైదుగురు శూరులైయుండి
నాతితోఁ గూడి కానలకుఁజనిరి
నిషధభూధవుఁడు మానినిఁబాసికుంనుచు
నీచునిగతి నొక్కగోచిదాల్చె

వసుదేవుఁ డతివైభవమువాసి భీతితోఁ
జంటిబిడ్డల నెల్లఁ జంపనిచ్చె

గీ॥ వారికేయిన్నికష్టము ల్వచ్చియుండ
వగవనేటికి నింక నెవ్వారలైన ॥ఘ॥

సీ॥ కడుభయదాకృతుల్ గలకాలకింకరుల్
నిక్కంబుగాఁ జెంతనిలుచువేళ
వాంఛఁ బ్రసింధుపత్నినువచ్చి వగచుచువీక్షించి
పేరెత్తి పల్మరుఁ బిలుచువేళ
కనలేక వినలేక గాసికోర్వఁగలేక
పొలుపేది గళమెండి పోవువేళ
పొరలుచుమూల్గుచుఁ జరణముల్దన్నుచోఁ
గఫవాతపైత్యముల్ గప్పువేళఁ

గీ॥ బరగనీదివ్యనామంబుఁ బలుకునట్లు
నాకుదయసేయు మొక్కెడలోకనాథ॥ఘ॥

సీ॥ సిరిగల్గువాఁడని చిత్తంబులోపల
ఖండితంబుగఁ గుచేలుండు దలఁచె
బావమరందిగా భావంబులోపలఁ
బ్రియముతోఁదుతధనంజయుఁడుదలఁచెఁ
దనశత్రుఁడనుచును దగమానసంబున
దుర్మతియైన చైద్యుండు దలఁచె
హృదయేశ్వరుండని హృదయంబులోపలఁ
భాసురంబుగ సత్యభామ దలఁచె

గీ॥ జారుఁడనుచును వల్లవచారుముఖులు
దలఁచిరేగాని హరియంచుఁదలఁపరైరి॥ఘ॥

## శ్రీపాండురంగశతకము

సీ॥ శ్రీజయదేవుల చిత్తశుద్ధికిఁ జాల
మెచ్చికాల్సేతుల నిచ్చినావు
నామదేవులుపెట్టు నైవేద్యమెల్లను
మించిసాక్షాత్తు భుజించినావు
జ్ఞానదేవులతోడ మానుగాఁగుడ్యంబు
చెన్నొందనడచిపోఁజేసినావు
భోసలబావకై కాసులమోయుచు
వెట్టితనంబు చేపట్టినావు

గీ॥ ఆడకాడకు మనమునవద్భుతంబు
గలిగెగదవయ్య నీదివ్యకథలువినిన ॥ఘ॥

సీ॥ అన్నంబుపెట్టి నిన్నలరింపఁజేయఁగా
వరుసరుక్మాబాయి వసితగాను
భక్తిచే మెప్పించి పనులుసేయింపఁగాఁ
దలపఁ జనాబాయితరుణిఁగానుఁ
బాహిణావాయునృలు తప్పక నీకుసర్పింప
సరసకానోబాత్రి సతినిగాను
వలనొప్పఁబూజించి వశముచేసికొనంగ
మరియు మీరాబాయి మగువఁగాను

గీ॥ జెలఁగి నినుమెచ్చఁజేయ నాచేతఁగాదు
నీవె దయయుంచి రక్షించునిగమవేద్య॥ఘ॥

సీ॥ తలపోయ నాల్గువేదంబులు మహిమంబు
నిక్కంబుచదువుట దొక్కవింత
కోసిభక్షించిన కోడెతానుండిన
కొట్టంబులోనుంట గొప్పవింత

అల్లసజ్జచ్చులోఁ బిల్లికూనలుమూడు
కాలకయుండుట చాలవింత
గ్రక్కునమంటిలోఁ ద్రొక్కిచంపినబాలు
మలరంగఁ దెచ్చుట మఱియువింత

గీ॥ పరగనీనామమెప్పుడు పలుకువారు
వేడ్కతోముక్తి గాంచుటవింతయౌనె॥ఘ॥

సీ॥ అలజనాబాయి జీర్ణాంబరంబునుగొని
యెలమిఁ గాంచనచేలమిచ్చినావు
కడునీచుఁడనక చోకామేళుపఙ్క్తిని
బెరుగునన్నము మెక్కమరిగినావు
పరగసేనానావి భక్తునకైపోయి
దొరకుక్షౌరముసేయ నెరిఁగినావు
దలపోయఁగాఁ గబీర్దాసునియింటిలో
నెరివస్త్రములుసేయ నేర్చినావు

గీ॥ ఔరపనివాఁడ వౌదువేమందునిన్ను
నచ్చుగారుక్మిణీదేవి మెచ్చుకున్న॥ఘ॥

సీ॥ బాలప్రాయమునుండి భాసురంబుగనునీ
పాదాబ్జములునమ్మి బ్రతుకుదాన
నంచితభక్తితోనలరుచు నీదివ్య
చారిత్రమేవేళఁ జదువుదాన
నిశలఁబవళ్లను నీశుభాకారంబు
చెలువందధ్యానంబుసేయుదాన
నిరతంబునీకును నీదాసజనులకుఁ
బాయకెప్పుడు నతుల్సేయుదానఁ

గీ॥ జేరినీకథలను వినఁగోరుదాన
నభయమీవయ్య వేగనన్నాదరించి॥ఘ॥

సీ॥ ఆడకాడకురుచి యధికమైయొప్పెను
మానుగానిన్నింక మరువఁజాల
దినదినంబునకు నామనమొల్ల గరఁగెను
మానుగానిన్నింక మరువఁజాల
బ్రతికినన్నాళ్లు నీపదములర్చించెద
మానుగానిన్నింక మరువఁజాల
వేసారినీవెంత విడనాడఁజూచిన
మానుగానిన్నింక మరువఁజాల

గీ॥ దానవాంతకనమ్మినదానఁగాన
మానసంబుననిన్నింక మరువనౌన॥ఘ॥

సీ॥ దానధర్మక్రియా తతులకన్నిటికంటె
భావింప నీపాదభక్తిమేలు
సత్యక్షమాశౌచ సద్వ్రతంబులకంటె
భావింపనీపాద భక్తిమేలు
అశ్వమేధాది మహాధ్వరంబులకంటె
భావింపనీపాద భక్తిమేలు
తీర్థయాత్రల వెంటఁ దిరిగియాడుటకంటె
భావింపనీపాద భక్తిమేలు

గీ॥ నిరతముసునిన్నుఁ గొనియాడునిశ్చలులకుఁ
బాపసంఘంబు లెన్నైనఁ బాయకున్న॥ఘ॥

సీ॥ పాటింపగా బొమ్మలాటకాడవునీవు
పోలుపేదిజంత్రింపు బొమ్మనేను

తిరుగలి చేఁబూని త్రిప్పువాఁడవునీవు
చెలువేదితిరుగు తిర్గలినేను
మేలుగానేర్చిన మిషణుకాఁడవునీవు
మిటమిటఁదిరిగెడు మిషనునేను
వివరింపగాఁగడి విద్దెకాఁడవునీవు
వేశ్యతోఁనీచేతి విద్యనేను

గీ॥ బరగనీవెట్లుద్రిప్పినఁ దిరుగుచుందు
నీవు చాలించినంతన నిలచిపోనె॥ఘ॥

సీ॥ దామాజిపండితు దయఁజూడఁగానెంచి
తలవరివైతివా దళితదోష
యేకనాథునియింట నేపారఁగాఁబరి
చారకుఁడైతివా మారజనక
రోహిందాసునకునై రూపింపఁగాఁజర్మ
పీఠమందుంటివా బిసరుహాక్ష
సామంతునకుఁగాఁగఁ బ్రేమతోఁడుతఁదోటఁ
ద్రవ్వితివా ఘోరదైత్యహరణ

గీ॥ భక్తులకుఁ జిక్కిఁగాదె యీపనులునీకుఁ
గలిగె నింతకుభక్తియేకారణంబు॥ఘ॥

సీ॥ అమరులునుతిసేయ నఘములఁబోఁద్రోయఁ
బాండవులనుగావఁ బ్రజలఁబ్రోవ
ధరణిభారమడంప దానవులనుద్రుంపఁ
బ్రకటించులీల గోపికలనేలఁ
గారవులనుమాపఁ గడుఁ జిత్రములఁజూపఁ
దపసులఁబెంపఁ బాతకులఁజంపఁ

గంసుశిక్షింప లోకములెల్లరక్షింప
దురితముల్గాల్ప సాధువులఁదేల్ప

గీ॥ గట్టిగా దేవకీదేవిగర్భమందుఁ
బట్టివై పుట్టితివి జగజ్జట్టివీవు॥ఘ॥

సీ॥ తప్పులెన్నున్నవో దయఁ జూడునీకు నే
మెప్పుగాఁ బద్యముల్చెప్పఁగలనె
తోచునానాకేమి యోచనదెలియునా
నాచందమెఱుఁగవా నళిననేత్ర
యేరీతిఁ జెప్పిన భారంబునీదకా
నేరంబులెంచకు నిర్మలాత్మ
పూనినిన్నోనియాడ నేనెంతదానను
హీనమానవురాల నెంచిచూడ

గీ॥ నప్పనినుఁదప్ప నన్యులనాశ్రయింపఁ
దప్పులెల్లనుక్షమియింపు తండ్రిభంగి॥ఘ॥

సీ॥ శ్రీకరంబైన వసిష్ఠస గోత్రుఁడై
పరగురామస్వామి పట్టినైతిఁ
గడుసద్గుణంబులుగల్గు శేషాఖ్యన
కిరవందగాసహోదరియునైతిఁ
బ్రియముతోజనులెల్లఁ బిలుచుటకవనిలో
సయమొప్ప శేషమ నామనైతిఁ
దలపోసిచూడనీ దాసజనాళికి
భాసురమతితోడ దాసినైతి

గీ॥ లాలితంబుగనీ భక్తురాలనైతిఁ
బూనిశతకంబుఁ జెప్పినదాననైతి॥ఘ॥

సీ॥ జయజయ క్షీరాబ్ధి సంభవాహ్లాదనేశ
జయజయ భవనాశ జగదధీశ
జయజయ వరమేఘ సన్నిభశుభగాత్రి
జయజయ సుచరిత్ర జలజనేత్ర
జయజయ నిఖిల సజ్జనబృందపరితోష
జయజయ మృదుభాష సర్వపోష
జయజయ మునిచిత్త జలరుహసంచార
జయజయ భీకర సమరశూర
గీ॥ జయ వినిర్జితపటుతర శత్రుజాల
జయ ధరామరవందిత చరణకమల॥ ఘ॥ 108

# శ్రీపాండురంగశతకము సంపూర్ణము.



—♦ ఈశతకముపై మహాజనాభిప్రాయములు ♦—

ఉ॥ శంభుజటావినిర్గళిత జహ్నుసుతాలహరీసమానవా
గ్గుంభము లుప్పతిల్లఁ గనుగోవిదు లౌదలలూపి మెచ్చ న
య్యంబుజవాసినీ ప్రియున కంకితమై తగ నంది పాటి శే
షాంబర చించెనీకృతి మహాధృతి భక్తిరసంబు జొత్తిలన్॥
చం॥ నగధరు పేర నీకృతి సనాతన నూతన పండితోత్తముల్
దగుఁదగునంచనన్ నవసుధారసధారల మీఱు వాక్తతుల్
మిగులఁ జెలంగఁ జేసెను సమీహితమై హితమైతనర్పఁ గాఁ
దగుఁ బొగడంగనిట్టి వనితా జనతా ఘనతల్ ధరాస్థలిన్॥
కం॥ ఇప్పాండురంగశతకం। బొప్పంగ బఠించితిని యథోచిత ర
తినిం। దుప్పతిలు భక్తిరసమున్। జెప్పఁగఁదరమౌనె యూది
శేషున కైనన్॥ ఇట్లు వచింపు, కవిజనవిధేయుఁడు
రాచర్ల శ్రీనివాసాచార్యుడు.

ఉ॥ అంబుజనాభు దివ్య చరణాంబుజ బంధురమై చెలంగు శే
షాంబ రచించి యీశతకమంబుజనేత్రునకర్పిగించెలో
కంబునఁ బాండురంగశతకంబని నిచ్చెలంగు భక్తిభా
వంబధికంబు దీవసులభంబుకవిత్వము ముద్దులొల్కెడిన్॥
ఏ. పి. కవి, సనప. అనంతపురం తా॥

గీ॥ భక్తిరస ముట్టిపడునట్లు పాండురంగ
శతకమును నందిపాటి శేషాంబ సెప్పెఁ
దరుణియని నాణి పక్షపాతము వహించి
నచ్చివాక్రానమునవిల్చి పల్కుకతన॥
సి. వేంకటకృష్ణశర్మ,
శ్రీ చౌడేశ్వర్యాది గ్రంథకర్త, అనంతపురము.

## శ్రీమహావిష్ణుదశావతారపద్యములు

ఉ॥ శ్రీకరమీనరూపమునఁ జెల్వగు వారిధిఁజొచ్చి సోమకున్
దాకివధించి వేదములు తద్దయుసత్కరుణాంబురాశివై
నైకొనిపోయిధాతకు జగంబులు మెచ్చగ నిచ్చితౌ భళీ
షాకట నందిపాటి పరిపాలమహీధవ చెన్నకేశవా॥

చ॥ ఇటుకునకూర్మరూపము బుధస్తుతనీవుధరించి వార్ధినం
తట వెసఁజొచ్చి వేల్పులుముదంబును జెందఁగ మందరాచలం
బిటునటుఁబోర్లనీయక రహిందగవీపునఁ దాల్చితౌ భళీ
పటుతరనందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

ఉ॥ వాసిగ సూకరంబవయి వారిజగర్భసురాధినాథకై
లాసగిరీశులెన్నగఁ జలంబుననక్కనకాక్షుదైత్యును
ల్లాసముతో వధించిధర లాఘవమొప్పఁగ నెత్తితౌ భళీ
భాసిలునందిపాటి పరిపాలమహీధవ చెన్నకేశవా॥

చ॥ తిరముగ నారసింహుఁడన ధీరతతోడుత నుక్క కంబమున్
దరుదుగ నుద్భవించి దనుజాధిపుఁడైన దితి పుత్త్రు దుర్మదున్
సరగున ద్రుంచి బాలకుని సత్కృపతోడుతఁ గాచితౌ భళీ
పరువడి నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

ఉ॥ ఎన్నగ వామనాకృతిని నింద్రుని మాతకుఁ బుత్త్రుఁడవై
చెన్నలరంగఁ బుట్టి బలిచే ధరదానము మూడుపాదముల్
గ్రన్నన వేడి గైకొని జగంబులు సర్వము నిండితౌ భళీ
పన్నుగ నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

చ॥ అలుకవహించి భూధవుల నారసి యిర్వదియొక్కమారుగాఁ
జలమున గండ్రగొడ్డఁటను జంపి ధరాతల మెల్ల వేడ్కఁ బెం
పలరఁగఁ గశ్యపుండను ధరాసురనాథునకిచ్చితౌ భళీ
బలమున నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

ఉ॥ తోయజమిత్త్రవంశ వర తోయధి తోయజ వైరివై మహా
కాయ నికుంభ కుంభ దశకంఠముఖాసుర వీరవర్యులన్
న్యాయరణంబున న్సురగణంబులు మెచ్చఁగ ద్రుంచితౌ భళీ
హాయక నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

చ॥ అచలితవీరుఁ డీతఁడహహా యని దేవగణంబు లెన్నఁగా
సుచరితయైన రోహిణికి సూనుఁడవై జనియించి వేడ్కఁ బం
ధుచయము సంతసింపగను దుర్మదశత్రుల ద్రుంచితౌ భళీ
ప్రచురత నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

ఉ॥ ఆగజచర్మధారికిఁ బ్రియంబొనరింపఁగ బుద్ధరూపము
న్నాగతిఁ దాల్చి ఘోరత్రిపురాసురవీరుల మోహితాత్ముల
న్వేగ నొనర్చి శంకరుని విశ్రుతకీర్తిని నిల్పితౌ భళీ
బాగుగ నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

చ॥ సుకవులు ప్రస్తుతింపఁగ వసుంధరలోపలఁ గల్కిమూర్తివై
సకలసుపర్వులెన్నఁగను సాధుజనాళిని బ్రోవ నెంచి ఘో
టకమును నెక్కి ఖడ్గమున డాంబికమ్లేచ్ఛులఁ ద్రుంచితౌ భళీ
ప్రకటిత నందిపాటి పరిపాల మహీధవ చెన్నకేశవా॥

ఉ॥ శ్రీవరయాదవోత్తముల చిత్తములుల్లసిలంగ దేవకీ
దేవికిబుణ్యుఁడైన వసుదేవునకున్ వరపుత్రకుండవై
వావిరిఁబుట్టిభూభయమువారకమాన్చి చెలంగితౌభళీ
పావననందిపాటి పరిపాలమహీధవ చెన్నకేశవా॥

చ॥ సదమలభూషితాంగ సురసన్నుత నీదుదశావతారముల్
హృదయములన్దలంచుచు మహిస్థలి సంతసమందువారికిన్
ముదముదలిర్ప సత్కృపను ముక్తిపదంబొసఁగూర్చితౌభళీ
పదపడినందిపాటి పరిపాలమహీధవ చెన్నకేశవా॥

కృష్ణావతారము దశావతారములలోఁజేరినదిగాదు
వేడుకగాఁజెప్పఁబడినది. కావున పదునొకొండుపద్యములైనవి

14-వ పుట 3 పంక్తి, దూర్వాసాదులకునెల్ల అనుచోట
దూర్వాసోముఖులకెల్ల యని గమనింపుడు.

శ్రీ నందిపాటి చెన్నకేశవార్పణమస్తు



రాయలసీమ ముద్రాక్షరశాల, కర్నూలు.